REG.No.M.2185 REG-No.N45

The First Teulgu Bi-weekly in Andhra Desa, The only Telugu News Paper for H E H The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

హైదరాబాదు-దక్కను

GOLAKONDA PATRIKA. HYDERABAD Dn

సంపుటము ౫ } ప్రమోదూతనామ సంవత్సర ఆశ్వీయుజశు॥ ౧౨ శనివారము 4—10—30 { సంచిక ౪౦

## ఏజెంట్లు కావలయును

మా పత్రికకు చందాదారులను కూర్చుటకు దిగువ స్థలములలో ఏజెంట్లు కావలయును:—

౧. సికింద్రాబాదు, ౨. భువనగిరి, ౩. జనగామ, ౪. వరంగల్లు, ౫. మహబూబాబాదు ౬. ఖమ్మం, ౭. వికారాబాదు, ౮. మహబూబునగరు ౯. నిజామాబాదు, ౧౦. బెజవాడ. ౧౧ కరీంనగరము, ౧౨. నాందేడు, ౧౩. గుల్బర్గా, ౧౪. సూర్యాపేట, ౧౫. మిర్యాలగూడెం, ౧౬. దేవరకొండ, ౧౭. ఆసిఫాబాదు

వివరములకై దిగువవారికి వ్రాయుడు.

మేనేజరు
గోలకొండ పత్రిక
ట్రూపుబజారు హైద్రాబాద్ దక్కన్.

## సూచన

దసరా పండుగ వలన కార్యాలయమునకు సెలవు లుండుటచే ఈ పేజీలు మాత్రమే ప్రకటింప బడినవి.

వ్యవస్థాపకుడు.

గోలకొండపత్రిక
ప్రమోదూత నామ సం॥ ఆశ్వీజ శు॥ ౧౨
శనివారము

## ఉస్మానియా విశ్వవిద్యాలయ భవనములు.

ఉస్మానియా విశ్వ విద్యాలయ భవనముల ప్లానులగూర్చి ప్రపంచమందలి విశ్వ విద్యాలయముల వీక్షించి స్థిరపరచుటకు మన ప్రభుత్వమువారిరువురు ఇంజనీరులను నియమించిరి. వారు మంగళవారము సాయంత్రము ప్రపంచ యాత్రకు బయలుదేరిరి.

మన ఉస్మానియా విశ్వ విద్యాలయమునకు ఉపదేశబోధన భాషగ (Medium of Instruction) నుండుటచే భారతవర్షమునందలి అన్ని విశ్వవిద్యాలయములకన్న నొక ప్రత్యేకత్వముగలదు. అట్టి ప్రత్యేకత్వము నిలుపుటకుగాను ౭౦ లక్షలు వ్యయపరచి అసాధారణ భవనములను నిర్మింప సమకట్టియున్నారు. ఈ విశ్వవిద్యాలయము విజ్ఞానమునందు గాకపోయినను భవనముల యందైనను ప్రపంచఖ్యాతి బడయవచ్చును. ఏలయన ఇపుడు బయలుదేరిన ఇంజనీయరులు అన్ని విశ్వవిద్యాలయ భవనముల వీక్షించి ప్రపంచములో నింతవరకులేని సుందరమైన కట్టడముల ప్లానులు దీయుదురు. వాని ప్రకారముపై మొత్తము వెచ్చించి భవనములు కట్టబడును.

దీనిచే ఉస్మానియా విశ్వ విద్యాలయ కళాశాలప్రస్తుతమువలె అద్దెఇండ్లయందే యుండవలయునని మా అభిప్రాయముకాదు. ఈ కళాశాలలకైతగు సౌకర్యములు గల భవనములు కట్టించవలయును కాని కట్టడముల ప్లానులకై ఇంజనీరుల ప్రపంచ యాత్రకై పంపుట మాత్ర మనవసరము. ప్రభుత్వము వారికి ప్రపంచమునందున్న అన్ని విశ్వవిద్యాలయ భవనముల పటములు సంపాదించుటకు వీలు కలదు. వానినుండి తమకు నచ్చిన భవనముల వివరములను కూడ తెప్పించు కొనుటకు సౌకర్యములు గలవు అట్టియెడ ఇంజనీరుల యాత్రకై వెచ్చించు మొత్తము అనవసరమని చెప్పిన తప్పుకానేరదు.

ఇంతకు పూర్వమీ విషయము గూర్చి సవిస్తరముగ చర్చించి యుంటిమి. కాని ప్రభుత్వమువారు దానిపై శ్రద్ధవహించి నటుల గన్పట్టలేదు. అయినను మా ధర్మము మేము నిర్వహించితిమని తృప్తినొందు చున్నాము. ఇట్టి కార్యముల వలన ప్రభుత్వము వారనవసర విషయములపై హెచ్చు మొత్తములు వ్యయపరచు చుందురను దురభిప్రాయము వ్యాపించుటకు వీలుకలుగును. కనుక ముందైన ప్రజాభిప్రాయములపై శ్రద్ధవహించ వలయునని దయామయులగు ప్రభుత్వము వారిని సవినయముగ ప్రార్థించుచున్నాము.

## స్థానిక వార్తలు

### చరఖాసంఘము

గురువారము దయమువిజయదశమియగు హిందువుల మహాపండుగను పురస్కరించుకొని చరఖా సంఘమువారు మహాత్మునిజయంతి సలిపిరి శ్రీయుత సంపత్ గిరిరావుగారు మహాత్ముని యాదర్శము చరఖాపంత్రమును గూర్చి కొన్ని సూచనల గావించిరి శ్రీ కాశింమహమ్మదుఖాన్ గారును బారిష్టర్ శ్రీనివాసశర్మగారును తమ భావముల వెల్లడించిరి ఈ సభ ఉదయము ౯ గంటలకు జరిగెను. సుమారు ౩౦ ప్రేక్షకులీసభ నలంకరించియుండిరి

(హైదరాబాద్ న్యూస్ సర్వీస్)

### వ్యాయామ పోటీ పరీక్షలు

శ్రీ హనుమద్వ్యాయామ మండలి పక్షమున వ్యాయామమండలుల పోటీపరీక్షలు గౌలిగూడెము వివేకవర్ధని పాఠశాలయందు పూర్వపు ఉన్నత వ్యాయామస్థాన వ్యాయామాస్త్రులగు పండిత కేశవరావుగారి యాజమాన్యమున ౨౮, ౨౯ అక్టోబరు తేదులందు జరుపబడెను. ఇందు వివిధ మండలుల వారు పాల్గొనిరి పోటీలలో కత్తిసాము, బల్లెముసాము మల్లయుద్ధము ముఖ్యమైనవి పరీక్షలలో వాంపల్లి వ్యాయామ మండలివారు అత్యుత్తమములుగా పరిగణింపబడిరి.

[హై. న్యూ. స.]

### మహాత్మాగాంధీ

వీరి ౬౨ వ జన్మదినోత్సవము గురువారము నాడు భారతదేశమందంతట జరుపబడెను.

### ఇంప్రూవుమెంట్ సొసాయిటీ

గురువారము దయముకలాచిగూడెమునందు ఎంగ్ మెన్స్ ఇంప్రూవుమెంటు సొసాయిటీవారి పక్షమున సుప్రసిద్ధ భారతజాతీయ నాయకులగు శ్రీ మోహనదాస కరంచంద్ గాంధి గారి జన్మోత్సవము విజయవంతముగా జరుపబడెను. పలువురు యువజనులు ఈ ఉత్సవమున పాల్గొని తమ యుత్సాహమును వెల్లడించిరి.

[హై న్యూ స]

### దసరాపండుగ

#### సికిందరాబాదు

ఇచట దసరాపండుగ విజయవంతముగ జరిగెను ప్రజలుత్సాహపూరితులై పండుగసంతోషమున నోలలాడుచుండిరి బజారులందు జనులు క్రిక్కిరిసియుండిరి సాయంత్రము ౪ గంటలనుండియు ప్రజలు శమీపూజ సేయుటకు వెడలుచుండిరి వీరందరును సుమారైదున్నర గంటలకు జేమ్సుస్ట్రీటు సమీపమునందుగల మయిదానమునకు చేరిరి ఈ ప్రజల సమూహము సంఖ్య సుమారు ౩౦ వేలుండవచ్చును వీరందరి హస్తములందు విరటుని సైన్యము ఉత్తర గోగ్రహణ సమయమున తమ శత్రువుల సంహరించుటకు ఆయుధముల ధరించిన రీతి మొక్కజొన్న కొన్నకర్రలు ఉండెను వీరందరును జయజయధ్వనులతో శమీపూజ గావించుకొని సుమారేడుగంటలకు దేవాలయముల దర్శనార్థము వెడలిరి ఈ దేవాలయములలో వేంకటేశ్వర దేవాలయమును నూతనముగ కట్టబడిన లక్ష్మీనారాయణ దేవాలయములును ముఖ్యమయినవి ఏవి యందు జనులు క్రిక్కిరిసియుండిరి వేంకటేశ్వరాలయములో రథోత్సవము జరిగినది. ఈసమూహము పదిగంటలవరకు నటులే తిరుగుచు తదుపరి తమతమ గృహములకేగిరి

[హై న్యూ స]

### ఆంధ్రసోదరీ సమాజ దసరా సమావేశము

గురువారమునాడు సాయంకాలము ౪ గంటలకు హైదరాబాదు ఆంధ్రసోదరీ సమాజపక్షమున శ్రీ కృష్ణ దేవరాయలు ఆంధ్రభాషానిలయమున దసరా సమావేశము జరిగెను. శ్రీమతి అక్కరాజు శ్యామలాంబ గారు అధ్యక్షత వహించిరి. హాలంతయు నారీమణులచే నిండియుండెను అధ్యక్షురాలు ప్రారంభోపన్యాసమునందు దసరా చరిత్ర ఈపండుగ ప్రాముఖ్యత, స్త్రీ విద్యావసరము మున్నగు విషయములగూర్చి తెలిపిరి. శ్రీమతి సీతాకుమారిగారు ఖద్దరువ్యవసాయముగూర్చి భావగర్భితమయిన ఉపన్యాసమును చదివిరి. వీరు స్త్రీలను ఖద్దరు ధరించుటకు ప్రబోధించిరి [ఈ యుపన్యాసము రాబోవుసంచికలో ప్రకటింపబడును] శ్రీమతి గిడితూరి రామానుజమ్మగారు బాల్య వివాహములగూర్చి యుపన్యసించుచు శారదాశాసనము అచరణయందుంచవలయుననియు బాల్య వివాహముల వలన ఎన్నియో అనర్థములు కలుగుచున్నవనియు కనుక బాలునికి ౨౦ సంవత్సరములకును బాలికకు ౧౬ సంవత్సరములకును వివాహముచేయవలయుననియు తెలిపిరి. అంత ఆంధ్రజాతీయ గీతముల గానముతో సభ జయప్రదముగ ముగిసెను.

(హై న్యూ స)

### శ్రీ రాణీ వెంకటలక్ష్మమ్మగారు మెదకు (పాపన్నపేట) సంస్థానము.

రెండుమూడు సంవత్సరములనుండి మేము ప్రాచీన కాలపు ఆయుధములను పోగుచేసి మా రెడ్డిహాస్టలునందుంచదలచి మా యుద్దేశమును గోలకొండ పత్రికమూలమున ౨ టి సంస్థానాధీశుల దగను విన్నవించుకొని యుంటిమి. అట్టితరి శ్రీరాణీ వేంకటలక్ష్మమ్మగారు దయతో రెండుబల్లెములను, ఒక తుపాకిని పంపి మా యుద్యమమును ప్రోత్సహించి కృతజ్ఞతాభివందనములకు పాత్రులయినందుకు శ్రీ వారిని మేమెంతయో యభినందించుచున్నాము. ఆధునికకాలమునందు ప్రాచీనాయుధములతో నవసరము లేనందున దినదినమవి యంతరించి పోవుచున్నయవి. చరిత్రాన్వేషణులకవి మిక్కిలి యుపయోగకరమయినవగుటచే వాటిని అన్వేషించుట మేము అక్షయముంచి యము, ఇతరులవద్ద నుండియు పయికిమిచ్చి కొనుచున్నాము. ఇప్పటికి కొలది మాత్రమే పోగయినవి. ప్రత్యేక గృహములలో నుండుటచే సర్వజనులకు వాటిని సందర్శించుటకు వీలుగలుగుటలేదు. మేము సంపాదించిన ఆయుధములన్నిటిని అందరు సందర్శించుకొనుటకు వీలుగను స్థలమందే యుంచియున్నాము. కావున అభిమానులందరు మాకు తమ కడనుండు ప్రాచీనాయుధముల పంపించి మా యుద్దేశము సఫలతచేయుదురనుగాక యని విన్నవించుచున్నాము.

ఇట్లు, పి. వి. రంగారెడ్డి
సంయుక్త కార్యదర్శి
రెడ్డిహాస్టలు

### మహాత్ముని జన్మోత్సవము

అక్టోబరు 3 నిన్న సాయంకాలము ౭-౩౦ గంటలకు కనిడెన్సుబజారు శ్రేష్ఠభవనమునందు సంఘసంస్కార సమితి పక్షమున మహాత్మగాంధిగారి 62 వ జయంత్యుత్సవము జరుపబడెను. సుప్రసిద్ధ ఆంధ్రనాయకులగు శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు అధ్యక్షపీఠము నలంకరించిరి పండిత శ్రీనివాసశర్మ వెంగులూరు నాయులగు సంపత్ గిరి రావు ఎమ్. ఏ. రామచంద్రనాయకు బారట్లాగారలు మహాత్ముని ఉద్యమము అతని గుణగణముల ప్రశంసించిన పిదప అధ్యక్షులు ఉపసంహారవాక్యములలో వందేమాతర కేకలు మిన్నుముట్ట సభ ముగిసెను,

సభ నలంకరించినవారలలో ముఖ్యులు దేశభక్త వామననాయక్, లక్ష్మణనాయక్; భీషంబర్ దయాల్ వకీల్ ౨, రామకృష్ణారావు ప్లీడర్ శ్రీనాథులు ఎమ్, కే, పిళ్లే నవరతంబాయి కుమారి సరోజిని నాయుడు

యెరవాడ చెరసాలలో నున్న మహాత్మునకు జైలుసూపరింటెండెంటు ద్వారా అభినందనవార్తను టెలిగ్రాము పంపుటకు నిశ్చయించిన తీర్మానము అంగీకరింపబడినది.

[హై న్యూ స]

ఈ సిగరెట్లు
అన్నిచోటలనూ
దొరుకును. ఏ
ప్పుడు ఒకటే
ధర, ఒకటే రకం.

# హనీడ్యూ సిగరెట్లు

BEARS'
HONEYDEW
TRADE MARK
CIGARETTES

మూండు
అణాలు

## గోలకొండ బుక్ డిపో

| | |
|---|---|
| ౧ రెడ్డికుల నిర్ణయచంద్రిక | ౧-౪-౦ |
| ౨ సంఘోద్ధరణము | ౦-౮-౦ |
| ౩ పంచముల చరిత్ర | ౦-౪-౦ |
| ౪ భారతీయ స్త్రీ ధర్మములు | ౦-౪-౦ |

ఈ నాలుగు గ్రంథములు ఒకేసారి తెప్పించుకొనువారికి ౧ తిప్పన్న చరిత్రము ౨ జీడికంటి రామశతకము ౩ బమ్మెర పోతనామాత్య విజయము ౪ క్షయవ్యాధి ౫ కృష్ణాలహరి మొత్తము ఒక రూపాయి పుస్తకములు ఉచితముగ నివ్వబడును. తపాల ఖర్చులు వేరు.

కొల్లకుబాలియ్యతులు నూటికి రు ౩ లు

గోలకొండ బుక్ డిపో
౧౫౧౫, తూపుబజారు హైద్రాబాదు (దక్కన్)

## శ్రీకృష్ణా సుదర్శన హోటలు
**(Sudershan Hotel)**
అఫ్జల్ గంజు హైద్రాబాదు

విశాలమైనగదులు, పరిశుభ్రమైన రుచికరమగు భోజనము నగరమునకు మధ్యన ఆఫీసులు. కార్యాలయములు, పాఠశాలలు, మార్కెటులు బజారు మొదలగునవి అందుబాటులో గలవు. ఒకసారి దర్శించిన అన్నియు విశదము కాగలదు. ధరలు అతిచౌక. వెంటనే వివరములు కనుగొనుడు.

మేనేజరు

## గోలకొండ పత్రిక

### ఏజంట్లు

హైదరాబాదు

1 జి. ఆర్. మూర్తి — లింగంపల్లి
2 నా. గౌరీశంకర వర్మ — రెసిడెన్సీబజారు
3 కాళిదాసు బి పురోహిత్ — ,,
4 డి. యాదగిరి మహాత్మా ఫత్తరు మసీదు ఎదుట — గౌలిగూడ
5 భవానీ అందుకో నల్లగొండ

## డోంగ్రేగారి బాలామృతము

ఉపయోగించుట వలన

బలహీనతను
పోగొట్టును

బిడ్డలకు బలమునిచ్చి

సౌఖ్యము కలిగించును
ఒక బుడ్డి వెల ౧ రూపాయి

పోస్టు ఖర్చులు ౫ అణాలు

ఎల్ల చోటులందును దొరకును
K. T. DONGRE & Co.
GIRIGAUM, BOMBAY




## అమృతాంజనము

తలనొప్పులు, పార్శ్వపు నొప్పులు, పడిశము, జలుబులు, తీపులు, వాపులు అను గోలకొండకు వజ్రాయుధము.

అమృతాంజనము డిపో
మద్రాసు బొంబాయి

## గోలకొండ పత్రిక
తూపు బజారు హైద్రాబాదు దక్కన్.

సంవత్సరము చందా

| | | |
|---|---|---|
| | రు. | ౬-౦-౦ |
| అర్ధ | ,, | ౩-౧౨-౦ |
| విడి పత్రిక | | ౦-౧-౪ |

Printed and Published by G. Ramakrishna Reddy at Golkonda Power Press, Hyderabad Dn Editor K. [illegible]krishna Reddy.